ముట్ట మొదటిసారిగా

ఇంటింటా అన్నమయ్య (ప్రింట్) సిరీస్ -3

# అన్నమయ్య

# సూక్తులు-సామెతలు

## *Words of Wisdom*



...గు, లలిత సంగీత మరియు ప్రకృతి, ప్రాణి సేవకురాలు

## ...టి జ్యోతిర్మయి చౌదరి

...జి ఇన్ కర్నాటిక్ ఓకల్

...చార్య సంకీర్తనలు & సాహిత్యం

...మాచార్య ప్రాజెక్టు, తిరుపతి



...సేవే పరమాత్మ సేవ'

ఇంటింటా అన్నమయ్య (ప్రింట్) సిరీస్ - 3

# అన్నమయ్య

## సూక్తులు-సామెతలు

(తెలుగు ఎడిషన్)




శాస్త్రీయ, లలిత సంగీత మరియు ప్రకృతి, ప్రాణి సేవకురాలు

**కొండవీటి జ్యోతిర్మయి చౌదరి**

పి.జి ఇన్ కర్నాటిక్ ఓకల్

స్కాలర్, అన్నమాచార్య సంకీర్తనలు & సాహిత్యం

టి.టి.డి అన్నమాచార్య ప్రాజెక్టు, తిరుపతి

122/ఎ, కళ్యాణ్ నగర్-3, మోతీనగర్ దగ్గర,

హైదరాబాదు - 500 018. ఫోన్ : 3837840

www.kondaveeti.org

అన్నమయ్య సూక్తులు - సామెతలు



**కొండవీటి జ్యోతిర్మయి చౌదరి**






ఇంటింటా అన్నమయ్య (ప్రింట్) సిరీస్-3

ప్రథమ ముద్రణ (తెలుగు) ఆగస్టు 2002

కాపీలు~ 100000



ప్రచురణ కర్త
**కొండవీటి మురళి**, జర్నలిస్ట్ & మీడియా కన్సల్టెంట్
ఛైర్మన్
కొండవీటి ఫౌండేషన్ (రిజిస్టర్డ్)
122/ఎ, కళ్యాణ్ నగర్ - 3
హైదరాబాద్ - 500 018
ఫోన్ 3837840

---

వెల రూ **10/-**
(100 పుస్తకాలు 30% తగ్గింపుతో రూ 700/-)








ఓం శ్రీ వేంకటేశాయ నమః!
ఓం శ్రీ అన్నమాచార్యాయ నమః!!

అన్నమయ్యలోని ఆధ్యాత్మికతనే కాక ఆయనలోని సామాజిక స్పృహను, ఆదర్శభావాలను కూడా ప్రచారం చేయాలన్న సత్‌సంకల్పంతో కొండవీటి జ్యోతిర్మయి చౌదరి ఆధ్వర్యంలోని 'అన్నమయ్య కళాపీఠం' మరియు 'కొండవీటి ఫౌండేషన్'లు ఎన్నో బృహత్తర కార్యక్రమాలు నిర్వహిస్తున్నాయి ఇందులో భాగంగా మొట్ట మొదటిసారిగా కొన్ని 'అన్నమయ్య సూక్తులు-సామెతల' ను వెలికితీసి గత ఏప్రిల్ నెలలో విడుదల చేసాం ఇప్పడు మరికొన్ని సూక్తులు, సామెతలను సేకరించి తెలుగు, ఇంగ్లీషు భాషల్లో ఒకే పుస్తకంగా విడుదల చేస్తున్నాం ఎక్కడ నుంచీ ఎటువంటి నిధులు లేకపోయినా కేవలం సంకల్ప బలంతో, స్వామి అనుగ్రహంతో, సొంత నిధులతో చేస్తున్న ఈ చిరు ప్రయత్నాన్ని ఆశీర్వదిస్తారని ఆశిస్తూ, ఈ పుస్తక ప్రచురణలో మాకు సహకరించిన పెద్దలు ప్రొఫెసర్ ముదిగొండ శివ ప్రసాద్, డా॥ ద్వా.నా శాస్త్రి, ఐ. సూర్యనారాయణ గార్లకు, నిరంతరం మమ్మల్ని వెన్నుతట్టి ప్రోత్సహిస్తున్న మా గౌరవాధ్యక్షులు జస్టిస్ గోగినేని రాధాకృష్ణారావు, టి.ఎస్. రావ్, ఐ.పి.ఎస్ గార్లకు మా ప్రత్యేక కృతజ్ఞతలు

- అన్నమయ్య కళాపీఠం & కొండవీటి ఫౌండేషన్
హైదరాబాద్ - 500 018



సంగీత, ఆధ్యాత్మిక, సామాజిక సేవారంగాల్లో అత్యంత చిన్నవయసులో ఎవ్వరూ చేయని రీతిలో చేస్తున్న విశిష్ట సేవలకుగాను ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ఎన్. చంద్రబాబు నాయుడు గారి మంచి సత్కారం అందుకుంటున్న జ్యోతిర్మయి చౌదరి

## ఆత్మీయం

సంగీత, ఆధ్యాత్మిక, సామాజిక సేవారంగాల్లో ఓ ట్రెండ్ సెట్టర్‌గా, 'కళ కళకోసం కాదు కళ ప్రజలకోసం, వారి ప్రగతికోసం' అంటూ 26 ఏళ్ళ కొండవీటి జ్యోతిర్మయి చౌదరి ఓ ప్రక్క శాస్త్రీయ, అన్నమాచార్య సంకీర్తనల గాయనిగా తన ప్రతిభను ప్రదర్శిస్తూ మరో ప్రక్క పలు సామాజిక సేవా కార్యక్రమాల్లో అగ్రభాగాన నిలుస్తున్నారు.

హైదరాబాదులో తాను స్థాపించిన 'అన్నమయ్య కళాపీఠం' ద్వారా కేవలం రెండేళ్ళలోనే 24 ప్రాజెక్టులు చేపట్టి రికార్డు స్థాయిలో ప్రపంచవ్యాప్తంగా అన్నమయ్య సంకీర్తనల ప్రచారం చేస్తున్నారు. 'ఇంటింటా అన్నమయ్య, అందరికీ అన్నమయ్య, అభ్యుదయవాది అన్నమయ్య'వంటి ఎన్నో వినూత్న కార్యక్రమాలద్వారా అన్నమయ్యలోని ఆధ్యాత్మికతనే కాక, ఆదర్శ భావాలను, సామాజిక స్పృహను ప్రచారం చేస్తూ అన్నమయ్య విశ్వరూప ఆవిష్కరణ గావిస్తున్నారు. ఉచిత శిక్షణ శిబిరాల ద్వారా వేలాదిమందికి అన్నమాచార్య సంకీర్తనల్లో స్వయంగా శిక్షణనివ్వడమే కాక, ప్రపంచంలోనే మొట్టమొదటిసారిగా ప్రారంభించిన ఇంటర్నెట్

కోచింగ్ 'ఇ- అన్నమయ్య' ద్వారా ప్రపంచ వ్యాప్తంగా వేలాది మంది ప్రవాసాంధ్రులకు ఉచితంగా సంకీర్తనల్లో శిక్షణనిస్తున్నారు 'సేవ - అన్నమయ్య' క్రింద ప్రకృతి, ప్రాణి పరిరక్షణ, అనాధ, అంధ, వికలాంగ బాలల, వృద్ధుల, ;మహిళల సంక్షేమ కార్యక్రమాలు నిర్వహిస్తూ జాతీయ, అంతర్జాతీయ ప్రముఖుల ప్రశంసలే కాక జాతీయ స్థాయి ప్రతిష్ఠాత్మక 'ఇండియన్ యూనివర్శిటీస్ బెస్ట్ సింగర్' అవార్డుతోపాటు పలు అవార్డులు, రివార్డులు, సత్కారాలు పొందారు




అన్నమాచార్య సంకీర్తనలపట్ల నాకు ఆసక్తిని కలిగించిన టి టి డి., అన్నమాచార్య ప్రాజెక్టు డైరెక్టర్, అవధాన సార్వభౌమ **డా॥ మేడసాని మోహన్, ఎం.ఏ., పిహెచ్.డి.**

అన్నమాచార్య సంకీర్తనల్లో నాకు శిక్షణ ఇచ్చిన అన్నమాచార్య ప్రాజెక్టు నిలయ గాయకులు, అన్నమాచార్య సంకీర్తనామహతి జి. బాలకృష్ణ ప్రసాద్ గార్లకు ఈ సందర్భంగా నా నమోవాకాలు.

**- జ్యోతిర్మయి చౌదరి**








**అన్నమయ్య సూక్తులు పంచండి !**

**ఆపద మొక్కులవాని అనుగ్రహం పొందండి !!**

కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామి నందకాంశంతో జన్మించిన అన్నమయ్య పలికిన ప్రతిమాట శ్రీ వేంకటేశ్వరుడు పలికించినదే 'అన్నమయ్య సూక్తులు - సామెతల'పై వెలువడుతున్న తొలిప్రచురణ అయిన ఈ పుస్తకాన్ని మీరేకాక, మీ తోటివారి కోసం, పిల్లల కోసం కొని ఉచితంగా పంచండి. స్కూళ్లలోను, పిల్లల బర్త్‌డే పార్టీల్లోను, వివాహ, షష్టిపూర్తి, గృహప్రవేశ వేడుకల్లోను మీ పేరుతో ఉచితంగా పంచి, శ్రీ వేంకటేశ్వరుని కృపకు పాత్రులవండి.

100 పుస్తకాలు తీసుకుంటే 30% తగ్గింపుతో పాటు, మీ పేరుతో పుస్తకాలపై ఉచితంగా స్టిక్కర్ వేసి ఇవ్వడమే కాక పోస్టల్ ఖర్చులు కూడా మేమే భరిస్తాం. అంటే 100 పుస్తకాలకు మీరు

రూ 1000/- బదులు రూ 700/- పంపితే చాలు మీ ఎం ఓ లేదా డి డి ఈ చిరునామాకు పంపండి


కొండవీటి జ్యోతిర్మయి చౌదరి

122/ఎ, కళ్యాణ్‌నగర్-3, మోతీనగర్ దగ్గర,

హైదరాబాద్ - 500 018 ఫోన్ . 3837840

e-mail : jyothi@kondaveeti.org


**గమనిక :** ఇ-అన్నమయ్య, అందరికీ అన్నమయ్య, ఇంటింటా అన్నమయ్య వంటి 24 ప్రాజెక్టులతో ప్రపంచవ్యాప్తంగా వివిధ వినూత్న కార్యక్రమాలు నిర్వహిస్తున్న "అన్నమయ్య కళాపీఠం" ఈ కార్యక్రమాల్లో శ్రీ వేంకటేశ్వరస్వామి భక్తులకు, అన్నమయ్య అభిమానులకు భాగస్వామ్యం కల్పించ నిశ్చయించింది పూర్తి వివరాలకు పై చిరునామాలో సంప్రదించ ప్రార్థన



# అన్నమయ్య
## సూక్తులు-సామెతలు

1 చంచలమైన మనస్సుతో చదువుల సారాన్ని, శాస్త్ర రహస్యాలను చవిచూడలేరు.

2. ధనాన్ని దోచుకున్నవాడే కాదు, తనకున్న ధనాన్ని ఎటువంటి మంచి పనులకు వెచ్చించక దాచుకునేవాడు కూడా దొంగే



3. మనిషికి నిజమైన శత్రువులు ఎక్కడో లేరు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే కనపడని అంతర్గత శత్రువులే మనిషికి నిజమైన శత్రువులు.

4. ఈ ప్రకృతిలో ఓ చిన్న చీమకైనా ప్రాణం పోయలేని మనిషి తోటి మనుషుల్ని, నోరులేని అమాయక జంతువుల్ని సంహరిస్తూ ఎందుకు ఇంత జీవహింసకు పాల్పడుతున్నాడు ?!

5. త్యాగధనులిచ్చే ఒక్క రూపాయైన, పేరు ప్రఖ్యాతులకోసం ధనవంతులిచ్చే కోటి రూపాయలకన్నా విలువైనది.



6. ఈ సృష్టిలో పాములు, పులులు మనం అనుకున్నంత ప్రమాదకరమైనవి కావు మనుషులే కొందరు వీటికన్నా అత్యంత ప్రమాదకరంగా, క్రూరంగా ప్రవర్తిస్తుంటారు

7. మనసా, వాచా, కర్మణా (త్రికరణశుద్ధిగా) చేసే పనులను దేవుడు మెచ్చుకుంటాడు, లోకమూ గుర్తిస్తుంది

8. దేశాన్ని కేవలం సైన్యమే రక్షించలేదు. ధర్మం రక్షిస్తుంది అయితే ధర్మాన్ని ప్రజలు, ప్రభువులు రక్షించినప్పుడు మాత్రమే (ఆచరించినప్పుడు మాత్రమే) ధర్మం వారిని రక్షిస్తుంది.



9. ఈ ప్రకృతిలో మనుషులు తమ కర్తవ్యాల్ని తాము సవ్యంగా నిర్వర్తిస్తే ప్రకృతికూడా తన పనుల్ని తాను సజావుగా చేసుకుంటుంది.



10. అగ్రకులం, అధమకులం అనేది కాని; రాజు గొప్ప, బంటు హీనుడని కాని; ఏనుగు విలువైనది, శునకం విలువలేనిదని కాని లేదు. అందరికీ ఒకే గాలి, ఒకే నీరు, ఒకే వెలుగు.

11 మనుషుడై పుట్టి ప్రయోజనం ఏమిటి ? జ్ఞానం లేకపోతే; హృదయం ఉండి ప్రయోజనం ఏమిటి? దయ లేకపోతే; ధనికుడైతే ప్రయోజనం ఏమిటి ? దానం చేయకపోతే; చదివితే ప్రయోజనం ఏమిటి ? శాంతి లేకపోతే; మాట్లాడితే ప్రయోజనం ఏమిటి ? ప్రియంగా మాట్లాడకపోతే, మనస్సుండి ప్రయోజనం ఏమిటి ? మాధవుడ్ని తలచకపోతే.

12. మొక్క మొదళ్ళని వదిలేసి కొనలకు నీళ్ళుపోస్తే ప్రయోజనం లేనట్లే ఎదలో వున్న పరమాత్మను వదిలి వేరే ఎక్కడో వెదకటం నిష్ప్రయోజనం.

13. కడలి (సముద్రం) అలలకు, మనస్సులోని కోరికలకు అంతం లేదు అలలు నిలచిన తరువాత స్నానం చేయాలనుకోవడం, మనస్సు నిలకడ పొందిన తరువాత భగవంతుడి తత్త్వం తెలుసుకోవాలనుకోవడం - రెండూ అసాధ్యాలే

14. కులం కన్న గుణమే ప్రధానం. ధర్మాన్ని ఆచరించటం, సత్యాన్ని పలకటం, పరుల హితాన్ని కోరుకోవటం, సమస్త జీవకోటిని ప్రేమించటం, ఆదుకోవటం, భక్తి - ఇవే భగవంతుని కులానికి ఉండాల్సిన గుణాలు.

15 నాస్తికత్వం అనే పేరుతో ఎదతలుపులు మూసుకున్న వారికి దైవతత్త్వం బోధపడదు

16. పరుల పంచలో బ్రతికేవారి జీవితం కడురోత పశువుగా, పక్షిగా చివరికి అడవిలో మృగంగా, క్రిమిగానైనా జీవించొచ్చు కానీ పరదాస్యపు బ్రతుకు మాత్రం బ్రతకకూడదు

17. సంప్రదాయమంటే తాతలు తవ్విన ఉప్పు బావిలోని నీటినే తరతరాలుగా త్రాగటం కాదు నిన్నటి మంచిని రేపటికి కరదీపికగా తీసుకువెళ్ళటం.

18. సమాజంలో అవిద్య, అన్యాయం, దారిద్ర్యం తాండవిస్తుండగా పాలకులు వాటిని తొలగించాల్సింది పోయి సమాజాన్నే దోచుకోవడమా ?

19 లౌకిక సుఖాలకు మరిగిన పాలకులు ఆధ్యాత్మికపు కరవులో, అజ్ఞానపు కరవులో కొట్టుమిట్టాడుతున్నారు.



20 నేడు మనం చూస్తున్న కరవు కాటకాలు ప్రకృతి సృష్టించేవి మాత్రమే కావు ఒక విధంగా ఇవి అజ్ఞానపు కరవులు. పాలకులు ముందుచూపులేక చేస్తున్న పనులకు, ప్రజలు అజ్ఞానంతో చేస్తున్న చర్యలకు ఫలితాలివి.

21. కాలగతియో, లోకం పోకడో కాని మంచి అడుగునపడి పోతోంది. నిజం కనుమరుగవుతోంది. ధర్మం తలక్రిందులవు తోంది. విజ్ఞానం, వివేకం లోపిస్తోంది. ఆచారం తడబడుతోంది, జాతి విలవిలలాడుతోంది.

22. మనుషులు మొక్కుబడుల పేరుతో తమకు ఇష్టమైన మద్య, మాంసాలను దేవుడికి నైవేద్యం పెడుతూ దైవతత్వాన్ని అపహాస్యం చేస్తూ తమను తాము మోసగించుకుంటున్నారు మద్య, మాంసాలను దేవుడికి నైవేద్యం పెట్టడం వామాచార పద్ధతి. ఇటువంటి తామస పూజలు తగవు

23. దైవ ధనాన్ని ప్రభువు ఆశిస్తే ఆ రాజ్య భవిష్యత్తు కడు దుర్భరం.

24. వెలుగుతున్న కర్పూరదీపాన్ని ఆర్పి, అది తమ మంత్రశక్తి అని చెప్పుకునేవారు అదే శక్తితో ఆరిపోయిన కర్పూరాన్ని తిరిగి వెలిగించగలరా ?

25 సమస్త జీవకోటికి తండ్రి శ్రీ వేంకటేశ్వరుడు, తల్లి అలమేలు మంగ. సర్వప్రాణి సేవే శ్రీనివాస సేవ.



26. జాతి భేదాలు శరీరానికి సంబంధించినవే ఆత్మ పరిశుద్ధమైనది అది నాశనం లేనిది. ఏ దోషము అంటనిది. ధర్మమూలమైన పరతత్త్వజ్ఞానం, హరిని గురించిన విజ్ఞానం, విష్ణునామస్మరణ- ఇవే సుజాతికి మూలస్తంభాలు.

27 జీవ స్వరూపంతోపాటు దైవ స్వరూపాన్ని తెలుసుకోవడం, జ్ఞాన, భక్తి, వైరాగ్య మార్గాలతో ఆచార్య విశ్వాసం వదలక శరణాగతి తత్త్వంతో శ్రీ వేంకటేశ్వరునికి సేవ చేయటమే బ్రహ్మానంద వేదాంత రహస్యం.

28. జానెడు పొట్ట, గుప్పెడు తిండి కోసం పడరాని పాట్లు పడుతూ, చేయరాని పనులు చేయడంకన్న ఈ భ్రాంతులను విడనాడి పరమాత్ముని సేవానిరతియందు మనస్సు లగ్నం చేయడం మేలు.

29. నడచి తిరుమలకొండ ఎక్కే ప్రతి భక్తుడు శ్రీ పదార్చన చేస్తున్నవాడే

30 అందరికీ కర్తవ్యాన్ని ఉపదేశించవలసినవాడు శ్రీ వేంకటేశ్వరుడే.

31. జగన్నాథుడు మేలుకుంటే జగమంతా మేలుకుంటుంది. మన జీవితాలకు జగన్నాథుడైన శ్రీనివాసుని మేలకొలుపే రక్ష.

32. ఈ భవబంధాలను తప్పించుకోవడమెలా ? ఇంద్రియాలను అరికట్టడమెలా ? ఆశాపాశాలను తొలగించుకోవడమెలా ? ఒకదానితో మరొకటి పెనవేసుకున్న ఈ లంకెల సంకెళ్ళ నుండి

తప్పించుకునే సులువైన మార్గమెలా ? అని ఆలోచించే వారికి నిజమైన, సులువైన మార్గం ఒక్కటే అదే శ్రీ వేంకటేశ్వరుని శరణాగతి.



33. హరిభక్తులు నరహరిని తప్ప, ఏ నరపతిని ఆశ్రయింప పని లేదు. తలవంచనక్కరలేదు

34. శ్రీ వేంకటేశ్వర సేవ అంటే సమస్త ప్రాణికోటిని సేవించడమే. అంధులను, బధిరులను, పిచ్చివారిని సేవించడం ద్వారా శ్రీ వేంకటేశ్వరుని అనుగ్రహానికి పాత్రులం కాగలం.

35. అందరికీ అభయాన్నిచ్చే బంగారు చేయి శ్రీ వేంకటేశుని చేయి.



36. అమ్మవారి జాతర్లలో జంతువులను బలి ఇవ్వటం మహాపచారం. సకల జీవులకు తల్లియైన అమ్మవారు తన బిడ్డలను తానే బలి కోరుకుంటుందా ?

37. ఈ లోకంలో జాతినిబట్టిగానీ, కులాన్నిబట్టి గానీ, ప్రాంతాన్ని బట్టిగానీ, రంగునుబట్టిగానీ, డబ్బును బట్టిగానీ వచ్చేది నిజమైన గొప్పదనం కాదు ఏ జాతి, కుల, ప్రాంతం, వర్గం వారైనా భగవంతుని గురించి తెలుసుకుని మసలుకున్నవారే నిజమైన గొప్పవారు వారి జీవితమే ధన్యం

38 పుట్టడం నిజం, చనిపోవడం నిజం. ఈ రెండింటి మధ్య నడిచేది ఉత్త నాటకం. నాటకంలో వేదికపైకి వచ్చి ఆడిపోయే పాత్రధారులే మానవులు వీరిని ఆడించే సూత్రధారుడే శ్రీ వేంకటేశ్వరుడు.

39. మందు కాని మందు విష్ణు నామం అది చిత్తశాంతికి మందు, ఇహపరాల్లో బలం చేకూర్చేది, భవరోగాలను రూపుమాపేది.

40. ఈ సృష్టి అశాశ్వతం, ఈ బ్రతుకు అబద్ధం అని తెలిసినా చంచలమైన మనస్సు పరిపరివిధాల మోహాలకు లోనవుతూ వంచనలకు, మాయలకు, నటనలకు గురవుతోంది. మనస్సుకు పట్టిన ఈ అజ్ఞానపు తెరలను తొలగించు కోకపోతే జీవికి ముక్తి లేదు.

41 ఇహలోక సౌఖ్యాలకోసం నరులను, నరపతులను నమ్మి మోసపోవడంకన్నా శాశ్వతమైన పరమాత్మ సాన్నిధ్యం కోసం భగవంతుడ్ని నమ్మండి, సేవించండి

42 మొసలిబారినపడిన గజేంద్రుడిని తన సుదర్శన చక్రంతో విష్ణుమూర్తి రక్షించినట్లే ఈ జగత్తనే కొలనులో మొసళ్ళనే కోరికల బారినపడి విలవిలలాడుతున్న మానవులకు రక్ష కూడా ఆ శ్రీమన్నారాయణుని సుదర్శన చక్రమే.



43. ప్రకృతిని, ప్రాణికోటిని, తోటి మానవుల్ని ప్రేమించలేనివాడు ఎన్నటికీ భగవంతుడిని చేరలేడు.

44. పెదవులతో ప్రార్థించడమే కాదు చేతులతో చేతనైన సాయంకూడా చేయాలి

## సంకీర్తనా శక్తి

45. కృతయుగంలో ధ్యానం వలన, త్రేతాయుగంలో యజ్ఞ, యాగాదులవలన, ద్వాపరయుగంలో అర్చనవలన భగవంతుడ్ని

చేరుకోగలిగితే, కలియుగంలో సంకీర్తన ద్వారా కలియుగ దైవమైన శ్రీ వేంకటేశ్వరుడ్ని చేరుకోగలం.

46 సంకీర్తన మానవుని సత్కర్మకు దారి తీస్తోంది సంకీర్తన, సత్కర్మ రైలు పట్టాల్లాంటివి ఓ ప్రక్క సంకీర్తన మరోప్రక్క సత్కర్మ సమాంతరంగా సాగితేనే లోకకళ్యాణం.

47 కలియుగంలో భగవంతుడిని సంకీర్తనలతో పూజించాలని శాస్త్ర ప్రమాణం సకల దుఃఖాలను రూపుమాపే హరినామ సంకీర్తనం సర్వశ్రేయస్కరం

48. కలియుగంలో నామ మహాత్మ్యం చాలా గొప్పది వేదాలు చేసిన పనికూడా ఇదే సర్వమంగళ స్వరూపుడైన ఆ సర్వేశ్వరుడ్ని స్తుతించడమే సంకీర్తన లక్ష్యం.

49 సంకీర్తన అంటే అహింసా యోగం

50. మానవులకు సంతాపాన్ని పోగొట్టి సంతోషాన్నిచ్చేది, జంతు జాలాన్ని రక్షించేది, ప్రకృతిని పరిరక్షించేది - ఒకటేమిటి అన్నిటికీ దివ్యౌషధం సంకీర్తనం

# అన్నమయ్య
## సామెతలు

1. ఊరులేని పొలిమేర.
2. కలగన్నచోటికి గంపయెత్తినట్లు
3. కొలిమిగూటిలో సూదులమ్మినట్లు.



4. ఏరునిద్దుర పుచ్చినట్లు.
5 చిల్లరవాని చేతలు చిరుచేదులే.
6 ఉన్నవారి మాటలెల్ల నూసివాసులే.
7. పేరు, పెంపులేని బ్రతుకు
8. ఎండలేని నాటి నీడ.

9. దండలేని తాలిమి.

10. జుట్టెడు కడుపు - పట్టెడు తిండి

11 గోరుచుట్టుపై రోకటిపోటు.

12 ఇచ్చలేని నాటి సొబగు.

13 పూటకూటి మీద తమ్మ ఉమిసినట్లు.

14. వేంకటాద్రి విభుడులేని వేడుక.

15 మొదలు విడచి నీళ్ళు కొనలకు పోసినట్లు.

16. బొంకులేని చెలిమి.



17. మీల కీతలు గరపినట్లు.

18. పిండంతే నిప్పటి యన్నట్లు.

19. హరియే యెరుగును అందరి బ్రతుకులు.

20 నీరు కొలది తామెరవు.



★ కొలిమిగూటిలో = ఇనుప వస్తువులు తయారుచేసే కార్ఖానాలో

★ నూసివాసులే = కాలక్షేపానికి చెప్పే మాటలు లేక కబుర్లు

★ ఇచ్చలేని = ఇష్టంలేని

★ సొబగు = సౌందర్యం లేక అందం

★ తమ్మ ఉమిసినట్లు = తమలపాకుల ఉమ్మి ఊసినట్లు

★ బొంకులేని = అబద్ధం లేదా మోసంలేని

★ మీల కీతలు = చేపలకు ఈతలు

★ తామెరవు = తామరపూవు

★ పిండంతే = పిండిని బట్టే

★ నిప్పటి = అరిశె



ఆపద కలిగిన వేళల తలపించుకోవాల్సిన

## ఆకటి వేళల ...

రాగం . శుభాళి స్వరకర్త . నేదునూరి కృష్ణమూర్తి

ఆకటి వేళల అలపైన వేళలను
తేకువ హరినామమే దిక్కుమరి లేదు ॥

కొఱమాలియున్న వేళ కులముచెడినవేళ
చెఱవడి వొరుల చేజిక్కినవేళ
వొఱపైన హరినామమొక్కటే గతిగాక
మఱచి తప్పిననైన మఱిలేదు తెరగు ॥

ఆపద వచ్చిన వేళ ఆరడిబడిన వేళ
పాపపు వేళల భయపడినవేళ
వోపినంత హరినామమొక్కటే గతిగాక
మాపుదాకా పొరలిన మరిలేదు తెరగు ॥



సంకెల బెట్టిన వేళ చంపఁబిలిచిన వేళ
అంకిలిగా నప్పుల వారాగిన వేళ
వెంకటేశు నామమే విడిపించగతిగాక
మంకుబుద్ధి పొరలిన మరిలేదు తెరగు ॥

సూచన : నరహరిని తప్ప నరులను, నరపతులను కీర్తించనని భీష్మించి, రాజు ఆగ్రహానికి గురై చెరసాలలో బంధింపబడినప్పుడు అన్నమయ్య ఆలపించిన సంకీర్తన ఇది. ఆపదలు, బాధలు కలిగినప్పుడు ఈ సంకీర్తన ఆలపిస్తే వాటినుంచి మీరుకూడా విముక్తులవుతారు.



'ఈ పాదమే కదా ఇల యెల్ల కొలిచెడిది'

కలియుగ ప్రత్యక్ష దైవం

శ్రీ వేంకటేశ్వర స్వామి పాదపద్మములకు నమస్కరిస్తూ ..... సెలవ్

———— తెలుగు విభాగం సమాప్తం ————

ANNAMAYYA

AT EVERY HOUSEHOLD (PRINT) SERIES - 3

# ANNAMAYYA

## QUIPS & QUOTES

(English Edition)




INAUGURATED BY BHARAT RATNA MOTHER TERESA

**KONDAVEETI JYOTHIRMAYE CHOWDARY**

P.G IN CARNATIC VOCAL

Scholar, Annamacharya Sankeerthanas & Sahityam

122/A, KALYAN NAGAR -3, HYDERABAD - 500 018.

PHONE : 3837840

www kondaveeti org

**ANNAMAYYA QUIPS & QUOTES**
**by KONDAVEETI JYOTHIRMAYE CHOWDARY**

Translated by
**PARTHASARATHY**



Annamayya at every household (Print) Series-3

First Edition (English) August, 2002

Copies . 100000

Published by
**KONDAVEETI MURALI**, Journalist & Media Consultant
Chairman
KONDAVEETI FOUNDATION (Regd.)
122/A, Kalyan Nagar - 3
HYDERABAD - 500 018
Phone 3837840

---

**Rs. 10/-**

(100 Books with 30% discount Rs 700/-)

*Bharat Ratna*

**Dr. A.P.J. ABDUL KALAM**

President of India





**Dedicated to the**

**Genius of a man abound with**

**Scientific and Human Outlook**

**- Kondaveeti Jyothirmaye Chowdary**

**THE FIRST OF ITS KIND WORK TO THE FIRST CITIZEN**



# FOREWORD

Om Sri Venkatesaya Namaha !
Om Sri Annamacharyaya Namaha !!



Tallapaka Annamacharya can be said to be the divine composer of 32,000 Sankeerthanas in praise of the Lord Venkateswara in whom, as legend says , he attained oneness. Each sankeerthana is unique. It is a great philosophy by itself. Bhakti (Devotion) is only one aspect of the multifaceted divine lyrics. A conscientious reader/ listener shall derive everything that is required for the life to become sublime.

This small work attempts to present a few 'Quips'- Annamayya's words of wisdom to introduce how this great visionary, blessed by providence possessed a rare breadth of universal outlook. Real devotion to Lord is 'Love

for all', Righteous ways of living,' 'Care for nature, animals & under previleged' and 'Service to humanity'. His sankeerthanas preach these ethical and social values to us. This small work is by no means comprehensive. The study of his preachings is endless 'the deeper one dives, the more one derives'.

This publication is brought out by Annamayya Kalapeetam and Kondaveeti Foundation as a part of 'Intintaa Annamayya' (Annamayya at every Household) print series with an aim to reach all the people. This book has been published Bi-lingual which is another milestone after a few Telugu publications in the past.

May Lord Srinivasa's blessings be showered on Humanity.

**- ANNAMAYYA KALAPEETAM & KONDAVEETI FOUNDATION (Reg)**
HYDERABAD - 500 018.

Kondaveeti Jyothirmaye Chowdary is setting a new trend in the fields of Music, Spirituality and Service with the motto: 'Arts are for the welfare of the people'; While scaling newer heights as classical singer of Annamacharya sankeerthanas, she is taking a lead role in service activities.

Promoting Annamacharya sankeerthanas does not mean simply giving concerts! She is trying to unravel many subtle aspects such as social - consciousness, social- ethics etc besides the Spiritual aspects in Annamayya, the divine composer.

Besides the path of single minded devotion, Annamayya preached ways of selfless service, caring for animals, obedience to nature, love for humanity to reach the Lord. Faithful to his preachings, she is rendering service programmes in a unique way.

No art form can fulfil its aim, if people intended for it do not form part of its promotion In

this direction, she is coaching hundreds of people 'free of cost' which is a unique way of promoting Annamayya sankeerthanas. She has also taken up about 24 innovative projects such as-Annamayya at every household, Annamayya for all, Annamayya, the progressive thinker. Such projects as these have not been attempted by any one so far.

Through 'e - Annamayya' project, training in keerthanas is being done through Internet for the first time in the world by her.

Under the 'Seva - Annamayya' project service and welfare programmes for animal protection, conservation of Nature, welfare of blind and orphan children etc are being taken up by her.

Following the untrodden path, Jyothirmaye chowdary in never before custom is striving hard to inculcate great values of Devotion, Service, Ethics in children - who are the real treasure of our Nation.

Parthasarathy is a teacher of English Literature, translator, editor and critic. He is a devout devotee of Lord Venkateswara .Besides listening to a good number of Annamacharya Sankeerthana, he studies them as pieces of poetry/ verses/ lyrics He has written commentary on a few Sankeerthanas bringing out the aspects of Bhakti (Devotion), Jnana (Wisdom), Prabodha (Preaching), Seva(Service), Neethi (Ethics), and so on. If one has to know Lord Venkateswara , one has to follow Annamayya. In this direction, Parthasarathy renders his humble service to the promotion of Annamacharya sankeerthanas.

# ANNAMAYYA QUIPS & QUOTES

1. A wavery mind cannot grasp the essence of education and secrets of science.
2. Is it of any use to water the tips of a plant leaving the roots dry? Similarly, ignoring the God within you, what use is to look for him here and there?
3. Everything that is done with Purity of Mind, Word and Deed (Trikaranas) shall be approved by Lord and it shall be beneficial to world.
4. Everything in this creation is momentary and the life is only a mystery. Despite knowing this, the wavery mind entangles to desires and follows unfair means. The layers of ignorance around mind have to be removed, only then a person attains real freedom.

5. There is nothing more horrible than a living of servility. It is better to live a free life as an animal or a bird or even as a tree in a forest.

6. One who robs or steals is not the thief; but the miser who does not spend for good deeds is the real thief.

7. Tradition does not mean drinking salt water from the well dug by the forefathers. It is to bear the good of the past as a torch for our search for truth.

8. Even as the society is ridden with ignorance, injustice, poverty; the rulers, instead of redeeming it , are trying to exploit it.

9. The rulers who are drunk with the earthly pleasures, are in the drought of Spiritual and Eternal knowledge.

10. Why does man, who cannot create life; who cannot breath life into even an ant; harm all life around him?

11. Even a coin given by those who sacrifice is much more valuable than a crore of rupees given by those doing so for fame.

12. Stones - Trees - Animals - Men is the order of development in the levels of awareness. However, the roots of nature are same. No creature is harmful or dangerous as we presume. Often, some men behave more harmfully than those creatures

13. What use is it being born a man without wisdom? What use is having a heart without kindness? What use is it being rich without any charity? What use is it being educated without making any peace? What use is

speaking without a soft tongue? What use is possessing mind without pondering about Lord?

14 Army alone cannot protect a country Dharma (Righteousness) protects. However, the rulers and the subjects shall have to preserve Dharma, only then dharma shall protect them.

15. Many calamities such as drought, floods etc are not natural. They are resultants of the lack of foresight of our rulers and the ignorant acts of the people.

16. When men fulfil their duties appropriately, Nature shall follow its course absolutely.

17. It is inhuman to sacrifice or to make offerings by killing innocent animals. Butchering an animal to please a Goddess in fairs is a

great sin. Goddess is kind and merciful. Bloodshed is never desired by her .

18. There is nothing like an upper caste or a lower caste The king is not great, nor the attendant is low. Elephant is not superior to dog. Every creature - Man or animal, learned or illiterate, rich or poor shall have to receive the light from the same sun

19. The differences of races etc pertain to the physical body. Aatma (the soul)within is sanctified. It is infallible and not vulnerable. Knowledge of eternal from which Dharma originates, knowledge of Lord Hari and Reciting his holy names are the real pillars for a righteous race.

20. Character is more important than caste. The qualitites of the Godly caste are - speaking

truth; following righteous path; wishing the welfare of others; loving all life in any form and supporting it; devotion to Lord Hari

21. The waves in a sea are incessant, so are the desires in our mind. It is unwise to wait for the waves to stop for bathing in a sea, and so to wait for the cessation of desires to know God.

22. Those who close the threshold of heart in the name of Atheism, can never understand Godliness.

23. Why get frustrated to feed the body by all unfair means. This earthly desire has to be given up and mind has to be tuned to serve the Lord.

24. One should know the God's form besides the forms of Life. Following the paths of

Jnana(Wisdom), Bhakti (Devotion), Vairagya (Renunciation) with faith in Guru (Master) and surrender to Lord Sri Venkateswara is the secret of Bliss.

25. Lord Hari, the Omniscient knows all lives.

26. Sankeerthana (Holy Recitation) mitigates despair and elevates happiness; it protects all.

27. Birth and Death are only realities. Rest is all a play Men and Women are characters of this play who are directed by the Lord Venkateswara.

28. Lord Vishnu's Namam(Name) is a panacea; it heals the ailing mind and comforts it, it cures all corporeal ailments; it fortifies us in earthly and heavenly matters.

29. It is desirable to attain Moksha (Realisation) by serving Lord Venkateswara instead of living a servile life serving a man.

30. Surrender to Lord Venkateswara is the only way to unchain the earthly bonds and desires, which we forged around ourselves.

31. When God is awake, the universe is awake. Let us pray to Lord Srinivasa to awake who is a saviour for us.

32. Never should we offer wine and meat to God. It is against Godliness.

33. Every devotee who walks up the Tirumala Hills is the worshipper of Lord's Holy feet.

34. It is Lord Venkateswara who preaches, 'what one's duty' is to all.

35. Where a king craves for the money that belongs to God, that country shall meet with bleak future.

36. The Seven Sins (Lust, Wrath, Penury, Desire, Temptation, Arrogance, Envy) are greater dangers than any physical enemy.

37. The devotees of Hari need not bend their heads before any man as master.

38 Can one, who feels great to blow a candle off, kindle a candle to light the darkness?

39. Lord Sri Venkateswara is the Father and Goddess Alamelu Manga is the Mother of entire Creation. Service to life in any form is service to Srinivasa.

40. Service to Lord Venkateswara is to serve all the living forms. By serving those who are disabled, we can derive his grace.

41. The hand that protects all is the Hand of Lord Sri Venkateswara (His Abhaya Hastam).

42. One who knows Lord Hari and lives in his worship is the blessed one irrespective of his birth or lineage.

43. It is better to trust the maker of men (Lord Hari) than men made by Him.

44 It is said that in Kritha yuga through meditation; in Tretayuga through rituals and in Dwapara Yuga through worship devotees could reach God. But in Kaliyuga (the Era now) through Sankeerthana (Recitation), we can derive the grace of Lord Srinivasa.

45. Sankeerthana brings out godliness in a devotee. He becomes universal in his outlook. He shall, then, be able to love all cre-

ation. Voilence has no room where love reigns A devotee transforms into an embodiment of love In other words, sankeerthana is non-voilence and peaceful state.

46 Sankeerthana promotes rightful deeds. They are the two sides of a coin, that should co-exist hand in hand for the Universal welfare

47 The standards of Kaliyuga preach that we should worship God through Sankeerthana. It is that which mitigates all pain and suffering.

48. The Names of Lord are Omnipotent. Sankeerthana of Lord's names is the way of Kaliyuga. Vedas have done the same They praised the Lord who is the source of all characteristics (Gunas)

49. Sankeerthana dispels despair and provides bliss; preserves all animals; protects Nature. It is the shield of protection for everything in Universe.

50. It is unwise to blame God for our failures or sorrows.He is always a provider for us. But it is our deserving that decides how much we would receive from him.

51. Lord Venkateswara is the great treasure given to us by our learned ancestors

52. God is what we ought to be

53. For a devotee who attains oneness with Lord Venkateswara, He becomes the devotee's inner as well as outer self.

54. The mysterious and adorable ways of Lord Venkateswara give various forms and positions to the aatma (Jeevudu).

55. "Devotion to nature and life is devotion to Lord"

# Glimpses of 'Seva-Annamayya' Service Activities
## Caring for ....



the Animals



the Plants





the Disabled



the Under-previlaged

## Caring for ....



the Aged



the Games



the Literature

FIRST OF ITS KIND

ANNAMAYYA
AT EVERY HOUSEHOLD (PRINT) SERIES - 3

# ANNAMAYYA
# QUIPS & QUOTES
## *Words of Wisdom*






**KONDAVEETI JYOTHIRMAYE CHOWDARY**
P.G IN CARNATIC VOCAL
Scholar, Annamacharya Sankeerthanas & Sahityam
T.T.D. Annamacharya Project, Tirupati
&
**PARTHASARATHY**
EDITOR & CRITIC